[illegible]ాం రాష్ట్ర

[illegible]ంధ్ర మహాసభ

# అధ్యక్షోపన్యాసము.

[illegible]

వృష సం॥ర జేష్ఠ శు ౭ మంగళవారం.

( ౨౯-౭-౫౦ ఫ. )

చిల్కూరు.

రావి నారాయణరెడ్డి

# నిజాంరాష్ట్ర అష్టమాంధ్రమహాసభ

# అధ్యక్షోపన్యాసము.

ఆహ్వానసంఘాధ్యక్షా! సోదరీ, సోదర ప్రతినిధులారా!

ఈ అష్టమాంధ్ర మహాసభకు, చిన్న వయస్కుడనగు నన్ను అధ్యక్షునిగా ఎన్నుకొని నాకొసంగిన గౌరవమునకు మీకు నాహృదయ పూర్వకమగు కృతజ్ఞతావందనము లర్పించుచున్నాను. బాధ్యతగల ఈ పదవిని మీ అందరి సహకార సానుభూతులు లభించునను ఆశ పైననే అంగీకరించితిని. ప్రజల సహకార సానుభూతులు లభించనిది ఏ ప్రజోద్యమముగూడా అభివృద్ధి జెందజాలదు. గావున వాని సహాయముతోనే ఈ బాధ్యతను అభివృద్ధిపూర్వకముగా నిర్వహింప గలనను ధైర్యము గలిగియున్నాను.

విషాద ప్రకటన.

మహాఘనతవహించిన నిజాంప్రభువరేణ్యుని మాతయును, నిజాం రాష్ట్రీయుల రాజ మాతయునగు, హజ్రత బడీ బేగం సాహెబా గారి మరణమునకు దుఃఖింపనివారుండరు. ఇందుకు మ. ఘ. వ. నిజాం ప్రభువుగారి దివ్య సముఖమునకు రాజభక్తిపూర్వకమగు సానుభూతి తెలుపుచు, దేశీయుల పక్షమున నాహృదయపూర్వకమైన విషాదమును ప్రకటించుచున్నాను.

ఆంధ్రోద్యమ కార్యకర్తలును, ప్రజాసేవాభిలాషులునగు, శ్రీయుతులు గంగరాజు రఘునాధరావు, మంగు శేషగిరిరావుగార్ల అకాల మరణముచే దేశమునకు సంభవించిన నష్టమునకు విచారించుచు, వారి కుటుంబములయెడ హార్దికమగు సానుభూతిని ప్రకటించుచున్నాను.

కృతజ్ఞత.

నల్లగొండ, వరంగల్లు జిల్లా మహాసభలకు మన కంగీకారములు గానట్టి షరతుల విధించి, మన అసంతృప్తికి కారణమైనప్పటికిని ఈ

మహాసభకు మన కనంగీకారములు గానట్టి షరతు లేమియు విధింపక అనుజ్ఞ నొసంగినందులకుగాను నా పక్షమునను, మీ అందరి పక్షమునను ప్రభుత్వమువారికి హార్దికమగు కృతజ్ఞత నర్పించుచున్నాను.

ఆంధ్రోద్యమము—అభివృద్ధి.

మన ఉద్యమము సుమా రిరువది సంవత్సరముల క్రితము గ్రంధాలయోద్యమముగా ఆరంభింపబడి, దినదినాభివృద్ధి జెందుచు, నేడు నిజాంరాష్ట్రాంధ్రుల, సర్వతోముఖాభివృద్ధికై కృషి సలుపు విశాలమగు ప్రజా ప్రాతినిధ్యముగల ఈ మహాసభగా పరిణామము జెందినది. నిజాం రాష్ట్రాంధ్ర మహాసభ హైదరాబాదు తెలుగు దేశమునందు నివసించు అందరికిని జెందినట్టిది. ఈ మహాసభయందు జాతి, మత విచక్షణలేక అందరునుచేరి పాల్గొనవచ్చును. మన ఉద్యమ హృదయము మతపాక్షిక విషయముచే కలుషితముగాక, పవిత్రముగా నున్నది. రాష్ట్రమునందలి పరిస్థితులు, పరిసరములు (environment) మనకంత అనుకూలముగా లేనప్పటికిని, గత వత్సరములలో మనము గనబరచిన అభివృద్ధితో, నిరుత్సాహపడవలసిన కారణము లేవియు నాకగపడుట లేవు.

సప్తమాంధ్రమహాసభ తర్వాత నిర్మాణరీత్యా తగినంత అభివృద్ధిని బడసితిమి. మన ఉద్యమ ఆదర్శము, జనసామాన్యముయొక్కయు, అందులో అధిక సంఖ్యాకులగు రైతులయొక్కయు సేవ జేయుటయని నిరూపించుటకు జయప్రదమైన ప్రయత్న మొనరించితిమి. రైతుల సేవ జేయుటయే మన కార్యక్రమముయొక్క ముఖ్యాంగముగా పరిగణించితిమి. మతపాక్షికోద్యమములను దేశద్రోహకరమగునవిగా నిర్భయముగా ప్రకటించి, బహిష్కరించితిమి.

జిల్లా సంఘములయందు చురుకుదనము కలిగింప ప్రయత్నించి కొంతవరకు సఫలీకృతులమైతిమి. తాలూకా సంఘములు విరివిగాను, పట్టీ సంఘములు అచ్చటచ్చటను స్థాపింపజాలితిమి. మొత్తముపై గత సంవత్సరము మనము గావించిన నిర్మాణకార్యక్రమము అభివృద్ధికరముగా నున్నదనియే చెప్పనచ్చును.

గత సంవత్సరపు అభివృద్ధిని మీతో మనవి జేసికొనినందులకు, మన సంస్థ గొప్ప శక్తివంతమైనదని వైనను, ముందు నిర్మాణ కార్య క్రమము తీవ్రముగా జరుప నవసరము లేదనియైనను మీలోనెవరైన భావిం చిన అది పొరబాటు. మన ఉద్దేశములను, ఆదర్శములను బడయుటకు మనమెంతయో శక్తిని నిర్మాణకార్యక్రమముద్వారా సంపాదింపవలసి యున్నది. పరిమాణ పూర్వకమగు ( Quantitative ) అభివృద్ధితో బాటు మన ఉద్యమముయొక్క యోగ్యతను (Quality) గూడా అభివృద్ధిజేసికోవలసియున్నది. కొన్ని జిల్లా సంఘములు, తాలూకా సంఘములు నామమాత్రావసిష్ఠములుగా నుండి చురుకుగా పని సాగిం చుటలేవు. గత సంవత్సరము ఒక జిల్లా సంఘమువారు బాధ్యతకు వెరచియో, లేక స్థానికాధికారులకు జంకియో అధ్యక్షులవారు పర్యట నము జేయుట కభిలషించినప్పటికిని వారి పర్యటనలో సహకార మొన రింప నిరాకరించిరి. మన సంఘములకు జెందిన ఎందరో సభ్యులు, జిల్లా సంఘ ప్రచారకులు చైతన్యరహితులు. మహాసభ నియమావళి యందు మన ఉద్యమము అభివృద్ధి జెందుచున్న కొలది, ఉద్యమ అవసర ములను దీర్పజాలని స్థితి ఏర్పడినది. ఇవియేగాక ఇంకను ఎన్నియో లోపము లున్నవి. వాటినన్నిటి సవరించుకొనకపోయినచో మన ఉద్య మము అభివృద్ధి గాంచలేదు. కావున దేశీయులతో నిర్మాణకార్య క్రమమునందు రాబోవు సంవత్సరమున ఇంతకంటె ఎక్కువ శ్రద్ధా సహకారములను ఆశించుచున్నాను.

అంతర్జాతీయ పరిస్థితి—రెండో ప్రపంచయుద్ధము.

మనము క్లిష్టమగు అంతర్జాతీయ పరిస్థితులయందు సమావేశ మగుచున్నాము. భయంకరమగు రెండో ప్రపంచయుద్ధము ఆరంభింప బడి, ఇరువదియొక్కమాసములనుండి వినాశకరముగా సాగుచునే యున్నది. ప్రపంచమునందలి పెట్టుబడిదారి (Capitalistic) విధానము గలిగి పేరొందదగిన దేశములన్నియును పాల్గొనుచున్నవి. యుద్ధము లేకాలమునాడైనను నష్టదాయకములే. కాని ఆధునికములైన ఈ ప్రపంచయుద్ధములు మానవ సమాజమునకు మరింత విధ్వంసకారకము

లైనవి. ౧౯౧౪ నుండి ౧౯౧౮ వరకు జరిగిన మొదటి ప్రపంచయుద్ధము నకు సంబంధించిన ఈ సంఖ్యలను పరికింపుడు:—

| | |
|---|---|
| మరణించిన సైనికులు | ౧౦౦,౦౦,౦౦౦. |
| మరణించిరని భావింపబడిన సైనికులు | ౩౦,౦౦,౦౦౦. |
| మరణించిన పౌరులు | ౧,౩౦,౦౦,౦౦౦. |
| గాయపడినవారు | ౨,౦౦,౦౦,౦౦౦. |
| ఖైదీలు | ౩౦,౦౦,౦౦౦. |
| అనాధలగు బాలబాలికలు | ౯౦,౦౦,౦౦౦. |
| యుద్ధ వితంతువులు | ౫౦,౦౦,౦౦౦. |
| రక్షణ గైకొన్నవారు (Refugees) | ౧,౦౦,౦౦,౦౦౦. |

ఈ సంఖ్యలను గమనించి వానిచే గలిగిన మానవ పరితాపమును ఊహింపుడు. గాయపడినట్టియు, మరణించినట్టియు వారిసంఖ్యయే నాలుగు కోట్ల అరువది లక్షల వరకగుచున్నది. యుద్ధమునకైన వ్యయమో? నేటివరకీ లెక్కలు సరియైనవి ప్రకటింప జాలకపోయిరి. శవములు గూడా లెక్కింప వీలుగాని ఈ యుద్ధవిధానమునందు, వ్యయమును లెక్కించ వీలౌతుందా? అమెరికా వారి ఒక అంచనా ప్రకారము ఇరు పక్షముల వారికి ౭౨౮౦,౦౦,౦౦౦,౦౦౦. (డెబ్బది రెండువేల ఎనిమిది వందల కోట్లు) రూపాయీలు కర్చైనవి.

నేటి రెండో ప్రపంచ యుద్ధము మొదటి యుద్ధముకంటె మరింత భయంకరముగా సాగుచున్నది. గత ఇరువది సంవత్సరములలో అభివృద్ధి జెందిన ప్రకృతి విజ్ఞాన శాస్త్రములద్వారా యుద్ధపరికరములలోని మారణశక్తి పెరిగినది. యుద్ధ విధానము అభివృద్ధిజెంది మెరుపు యుద్ధములోకి దిగినది. గత యుద్ధము ప్రపంచములో శాశ్వత శాంతి స్థాపనో ద్దేశముతోను, తిరిగి యుద్ధములు రాకుండా జేయుటకును, జరుపబడుచున్నదని ఇరుపక్షముల వారుగూడా ప్రకటించిరి. శాంతి నెలకొల్పబడిన తదుపరిగూడా యుద్ధములు రాకుండ జేయుటకు అంత ర్జాతీయ సంఘము (The League of Nations)ను స్థాపించి శాంతికై

ప్రయత్నింపబడెను. కాని అటుల జరుగలేదు. రెండో ప్రపంచ యుద్ధము మొదటి దానికంటె భయంకరమగు స్వరూపమున రానేవచ్చినది, సాగుచున్నది.

మానవ సమాజమెందుకీ యుద్ధముల ఢీకొనుచున్నది ? మానవ సమాజ కల్యాణమున కుపయుక్తమగు ప్రకృతి శాస్త్ర విజ్ఞానమెందుకు మానవ విధ్వంసమునకై వినియోగింప బడుచున్నది? శాంతిని నెలకొల్పుటకై గావించు ప్రయత్నము లన్నియు ఏల నిష్ఫలములై పోవుచున్నవి? ఇరు పక్షములవారు యుద్ధసమయాలలో, రక్తపిపాసతో క్రూర మృగములవలె ఎందుకు ప్రవర్తించెదరు.? ఆలోచింప శక్తిగల వారందరును ఈ సమస్యపై తీవ్రముగా ఆలోచింప వలసిన సమయమాసన్నమైనదని మనవి జేసికొనుచున్నాను.

ప్రస్తుతముండు సమాజముయొక్క పెట్టుబడిదారిఆర్థికనిర్మాణమే (Capitalistic Economic Structure of Society) ఈ భయంకరమగు యుద్ధములకు కారణమగుచున్నదని నా అభిప్రాయము. ఈ ఆర్థిక నిర్మాణమునకు లోనైన సామ్రాజ్య తృష్ణయే యుద్ధములకు దారి జూపుచున్నది. సామ్రాజ్య తృష్ణనశించనిదే యుద్ధము లంతమొందవు. ప్రస్తుతముండు ఆర్థిక విధానముపోయి దానిస్థానమున నూతన విధానము (New Order) రానిదే సామ్రాజ్య తృష్ణ నశించదు. ఒకనూతన విధానము యుద్ధానంతరము రానున్నదని అతి తీవ్రముగా మారుచున్న యుద్ధ పరిస్థితులే మనకు వేనోళ్ల చాటుచున్నవి.

మనమెంత దాగుడుమూతలాడ ప్రయత్నించి నప్పటికిని అంతర్జాతీయ పరిస్థితులు తమ ప్రభావమును మనపైన ప్రసరింపజేయుచునే యున్నవి. ఒక కాలమునాడు విశాల మనిపించిన ప్రపంచము నేడు రహదారుల మూలముగను, రేడియో, టెలిగ్రాఫు మొదలగు వాని మూలముగను సంకుచితమై పోయినది. యుద్ధానంతరము రానున్న నూతన విధానమునందు భాగస్వాములగుటకు తగిన అర్హతను మనముగూడా కలుగజేసికొన వలయును. మనలోనున్న కించిద్భావము

(Inferiority complex) ను వదలుకొని నూతన విధానముతో మనకు లభించు అవకాశములను ఆశించుటకు ముందు దాని కవసరమగు త్యాగమునుగూడా జేయుటకు సంసిద్ధముగా నుండవలయును.

దేశీయ సంస్థాన సమస్యలు.

భారతదేశమునందు దేశీయసంస్థానముల సంఖ్య ౫౬౨. వీనిలో కొలదిమాత్రమే పెద్ద సంస్థానము లనిపించుకో నర్హతగలవి. మిగిలిన వానిలో ఒకటికంటె నొకటి చిన్నది. ౧౭౯ సంస్థానములు జనసంఖ్య పది వేలకంటె హెచ్చుగను ఒక లక్షకంటె తక్కువగానున్నది. ౧౯౨ సంస్థానములు ఒక వేయికంటె హెచ్చుగను పదివేలకంటె తక్కువ జనసంఖ్య గలవిగా నున్నవి. ౧౩౧ వేయికంటెను, రెండు నూటికంటెను తక్కువ జనసంఖ్య గలవిగానున్నవి. ౧౭ సంస్థానములు వేయి రూపాయీల కంటె తక్కువ ఆదాయము గలిగియున్నవి. ఒకటి ౯౩ రూపాయీల ఆదాయముతోను, మరొకటి ౮౦ రూపాయీల ఆదాయముతోను విరాజిల్లుచున్నది. ౧౬౫ పది చదురపు మైళ్ల కంటెను, ౧౪ ఒక చదురపు మైలు విస్తీర్ణము కంటెను తక్కువ వైశాల్యముగలవిగా నున్నవి.

దేశీయ సంస్థానము లన్నిటిలోను, పెద్దదియును, ముఖ్యమగు నదియునగు హైదరాబాదు రాష్ట్రమునకు జెందిన మనము దేశీయ సంస్థానసమస్యలతో బాగుగా పరిచయము గలిగియుండుట అవసరమని ప్రస్తుత పరిస్థితులయందు నా కగుపడుచున్నది. ఈ సమస్యలలో ఉదాహరణ రూపకముగా కొన్నిమాత్రమే ఇచ్చట మనవి జేసికొనుచున్నాను.

దేశీయ సంస్థానములయందలి పరిపాలనా విధానమును గురించి, సంస్థాన ప్రజల మహాసభాధ్యక్షులగు శ్రీ పండిత జవహర్లాలు నెహ్రూగారు ఈ క్రింది అభిప్రాయమును ప్రకటించియున్నారు:—

"నేడు దేశీయ సంస్థానములనుగురించి ఎంతయో వాదోపవాదములు బయలు దేరినవి. ప్రజా ఉద్యమములగురించియు, ఈ ఉద్యమముల అణచుటకు అధికారు లవలంబించు చర్యల గురించియు వార్తలు పత్రిక లన్నిటిలోను నిండియున్నవి. ఆర్థికముగను, రాజకీయముగను

ఇవి వెనుకబడియుండి వానిలో నెన్నియో జమీందారి యుగము(Feudal age) నాటికి జెందినవిగా నున్నవి. వీనియందు వసూలు గావింపబడు పన్నులలోనుండి అధికభాగము సంస్థానాధీశుల భవన వ్యయములకే పోయి, కొలది భాగము మాత్రమే ప్రజల అభివృద్ధి కార్యములకై ఉపయోగింపబడుచున్నది."

మైసూరు తిరువాన్కూరు సంస్థానములు దేశీయ సంస్థానములన్నిటిలో సత్పరిపాలనము గలవిగా నెంచబడుచున్నవిగదా! ఈసంస్థానాధీశులు తమ స్వంత ఖర్చుకై అనుభవించు తక్కువ మొత్తములు సత్పరిపాలనా చిహ్నములలో నొకటిగా భావింపబడుచున్నవి. మైసూరు మహారాజగారి స్వంత వ్యయము ౨౩,౮౦,౦౦౦ (ఇరువది మూడు లక్షల ఎనుబదివేలు). తిరువాన్కూరు మహారాజుగారిది ౧౧,౦౦,౦౦౦ (పదకొండు లక్షలు). మైసూరు రాష్ట్ర ప్రభుత్వ ఆదాయము నాలుగు కోట్ల రూపాయీలు. తిరువాన్కూరుది రెండుకోట్లు. ఈ మొత్తము ఆదాయములతోను, ఈ రాష్ట్రపు ప్రజల దారిద్రముతోను సంస్థానాధీశుల స్వంత వ్యయములు పోల్చిజూచిన చాలా అధికముగా నున్నవని మనవిజేయ నవసరము లేదు.

యూరపునందుండు ఇటలీదేశ ప్రభుత్వాదాయము సంవత్సరమునకు ౨౮౦ కోట్ల రూపాయీలు. ప్రస్తుతము ఇటలీదేశపు రాజగు కింగు ఏమాన్యుయల్ (King Emmanuel) గారు తమ భవనవ్యయమునకై ౧౪,౦౦,౦౦౦ (పదునాల్గు లక్షలు) మాత్రమే గైకొంటారు. మైసూరు సంస్థానముయొక్క ఆదాయము ఇటలీదేశపు ఆదాయములో అరువదియవ భాగము, తిరువాన్కూరిది నూటముప్పదియవ భాగము. ఐనప్పటికి మైసూరు మహారాజాగారు ఇటలీ దేశపు రాజుకంటె సుమారు పది లక్ష లధికముగాను, తిరువాన్కూరు మహారాజగారు మూడు లక్షలు మాత్రమే తక్కువగాను అనుభవించుతారు. సత్పరిపాలనావిధానము గలవిగా భావింపబడు మైసూరు, తిరువాన్కూరులయందే ఇట్టి పరిస్థితులుండ వేరే సంస్థానములగురించి నేను మనవిజేయ నవసరము లేదు. మీరే ఊహించండి.

గాంధీమహాత్ముడు ౧౯౩౦ సంవత్సరమున సత్యాగ్రహోద్యమ ఆరంభమునకు పూర్వము ఇర్విను ప్రభువుగారికి వ్రాసిన సుప్రసిద్ధ లేఖయందు, భారతదేశపు వైస్రాయిగారు ఒక భారతీయుని సగటు ఆదాయముకంటె ఐదువేల రెట్లధికముగా వేతన మనుభవించుచున్నట్లు ఆక్షేపించినాడు. వైస్రాయిగారు ఐదువేల రెట్లనుభవించితే మనదేశీయ సంస్థానాధీశులెన్ని రెట్లు ఎక్కువ అనుభవించుతారో లెక్కించండి.

గత మూడు నాలుగు సంవత్సరములలో సంస్థాన ప్రజలయందు గూడా బ్రహ్మాండమైన జాగ్రతి గలిగినది. సంస్థానాధీశుల ఛత్రచ్ఛాయక్రింద ప్రజాస్వామిక పరిపాలనమును స్థాపించు ఉద్యమములు అభివృద్ధి జెందినవి. స్వాతంత్ర్య పోరాటములు విరివిగా వివిధ సంస్థానములయందు సాగింపబడినవి. ఈ ఉద్యమముల నణచు అధికార ప్రయత్నము గూడా తీవ్రముగా జరిగినది. ప్రజల పౌరసత్వముల నణచుటకై ఒకదానికంటె నొకటి కఠినములగు శాసనములు గావింపబడినవి. సత్యాగ్రహులు క్రూరముగా కొట్టబడి వివిధ రకములగు హింసలకు లోబడవలసి వచ్చినది. ఆస్తులు జప్తు జేయబడినవి. నిర్దోషులగు ప్రజలపై తుపాకులు పేల్చబడినవి. హింసల సహింపలేక ఎన్నియో సంస్థానములయందలి ప్రజలు తమ ఆస్తులు, ఇండ్లు వదలి వలస బోవలసివచ్చినది. ఇన్ని హింసాపద్ధతులవలంబింపబడినప్పటికిని స్వాతంత్ర్యోద్యమ మణచబడలేదు. ఈ మహాయజ్ఞముయొక్క ఫలితము ఈనాడు గాకున్న రేపైనను సంస్థాన ప్రజలకు లభించి తీరగలదని ప్రపంచ చరిత్రయే మనకు చాటుచున్నది.

ఈ సంస్థానములన్నిటియందును ప్రజాస్వామిక ప్రభుత్వ విధానములు స్థాపింపబడినప్పటికిని వీనిలో కొన్ని మాత్రమే భావిభారతదేశమునందు స్వతంత్ర పరిపాలనావిధానము గలిగియుండు నర్హతగలవి. మిగిలిన వన్నియును తమ ప్రక్కనుండు రాష్ట్రములలో కలిసిపోవలసియుండును. లూధియానాయందు సంస్థానప్రజల మహాసభవా రంగీకరించిన

ఈ క్రింది తీర్మాన మీ సమస్యా పరిష్కారమున కనుకూలముగా నుండు
నని నేను భావిస్తున్నాను:—

“ఇరువది లక్షల జనసంఖ్యయైన లేక ౫౦ లక్షల రూపాయీల
ఆదాయముగల సంస్థానములు మాత్రమే స్వతంత్ర భారతసమాఖ్యా
విధానమునందు చేరుటకై ఆచరణయోగ్యమైన యూనిట్లు (Units) గా
అవసరమగు పరిపాలనా పరిమాణములుగా నుండగలవని ఈ సభవారు
నిశ్చితముగా అభిప్రాయపడుచు, పైతరగతికిజెందని సంస్థానాధీశుల
న్యాయబద్ధమగు హక్కులకు తగుపరిహార మొసంగుచు, పరిపాలనా
సౌకర్యముకొరకై వారిసంస్థానములను, ఏకములుగానైనను, లేక
సమూహములుగానైనను ప్రక్కరాష్ట్రములలో కలిపివేయవలయునని
తీర్మానించుచున్నారు.”

యుద్ధానంతరము భారతదేశము బ్రిటిషు సామ్రాజ్యములో నొక
భాగముగానుండి అధినివేశస్వాతంత్ర్యము బొందనిండు, లేక బ్రిటిషు
సామ్రాజ్యమునుండి విడిపోయి సంపూర్ణ స్వాతంత్ర్యము బడయనిండు
దేశీయ సంస్థానములు అఖిలభారత రాజ్యాంగవిధానాన్ని అంగీకరించి,
భారతదేశముయొక్క నియమపూర్వకమైన భాగములు (constituent
units) గా నుండవలయునని సంస్థానప్రజలు కోరుచున్నారు. భారత
రాజ్యాంగ విధానసమస్యాపరిష్కారము సమాఖ్యా విధానముతోనే
జరుగు నవకాశముగలదని అన్ని పక్షములవారును అంగీకరించి యున్నారు.
అట్టి సమాఖ్యయందు బ్రిటిషు రాష్ట్రములతో బాటు దేశీయ సంస్థాన
ములుగూడా జేరి, దానియందిమిడియున్న రాష్ట్రీయస్వాతంత్ర్యము
అనుభవించుచు, అట్టిభారత జాతీయైక్యతలో ఇమిడియున్న ఆర్థిక, రాజ
కీయసౌకర్యములన్నియును పొందుటయేగాక, అవసరమగు త్యాగము
గూడా జేయుటకు సిద్ధముగా నుండవలయునని సంస్థానప్రజల అభి
మతము. బ్రిటిషు సామ్రాజ్యమునందు దేశీయ సంస్థానములను అలు
సలుగా జేయు ప్రయత్నమును, మరియు స్వతంత్ర భారతదేశమునందు
సంస్థానములను స్వతంత్రదేశములుగా జేయు ప్రయత్నములను సంస్థాన

ప్రజలు ప్రతిఘటించెదరని నేను వేరే మీతో మనవిజేయ నవసరము లేదు. సంస్థానములు రాజకీయద్వీపములుగానుండి సంపూర్ణ ఆర్థిక, రాజకీయవికాసమును బడయ లేవు. నేటియుద్ధమునందు యూరపునందున్న చిన్న చిన్న దేశములగతి ఏమగుచున్నదో గమనించి గుణపాఠముల నేర్చుకోదగును.

మన ప్రభుత్వ ఆయవ్యయములు.

ప్రభుత్వయంత్రము నడచుటకు ద్రవ్యము అవసరము. అన్ని దేశములయందు నిర్మాణింపబడియున్న ప్రభుత్వములు ప్రజలపై పన్నులు వసూలుజేసి పరిపాలనకై వ్యయము జేయుచున్నవి. మనరాష్ట్ర ప్రభుత్వముగూడా ఇటులనే చేయుచున్నదని వేరే చెప్ప నవసరము లేదు. మనప్రభుత్వమువారు ఏటేట ఎంతపన్ను వసూలు చేయుచున్నారు? దానిని ఏవిధముగా వ్యయము జేయుచున్నారు? ఈ ఆదాయ వ్యయములచేత పన్నులు చెల్లించు మనకు అభివృద్ధికరమగు లాభము కలుగుచున్నదా? దీనియందిమిడియున్న న్యాయాన్యాయ సిద్ధాంతము లేవిధమైనవి?

౧౩౫౦ ఫసిలీకి సంబంధించిన ప్రభుత్వ ఆయవ్యయముల అంచనా పట్టిక (బడ్జెటు) ప్రకారము మన ప్రభుత్వాదాయము సుమారు తొమ్మిదికోట్ల రూపాయీలనియు, వ్యయము ఇంచుమించుగా ఇంతే యనియు తేలినది.

ముఖ్యముగ ఆదాయము పద్దులిట్లున్నవి:—

| | | | |
|---|---|---|---|
| భూమిపన్ను (మాల్గుజారి) | ... | ... | ౩౧౦ లక్షలు. |
| కరోడ్గిరి (సుంకము) | ... | ... | ౧౨౦ లక్షలు. |
| ఆబ్కారి, నల్లమందు, గంజాయి | ... | ... | ౧౮౮ లక్షలు. |
| రైల్వేలు | ... | ... | ౧౩౫ లక్షలు. |

టప్పా, అడవులు, స్టాంపులు, బీరారు రుసుము, కాగిదపు నోట్లవల్ల లాభము, అగ్గిపెట్టెలపన్ను, పెట్రోలుపన్ను, మున్నగువానిపై ఇంచుమించుగా ఒకకోటిన్నర రూపాయీలు వస్తున్నవి.

ముఖ్యమగు వ్యయముల వివరాలిట్లున్నవి:—

| | |
|---|---|
| మాల్గుజారి ... ... | ౬౬,౭౧,౦౦౦. |
| ఆబ్కారిశాఖ ... ... | ౪౩,౩౪,౦౦౦. |
| ప్రభువుగారి స్వంతమునకుగాను ఏటేట చెల్లించు మొత్తము. (సర్ఫెఖాస్ ఆదాయముగాక) | ౫౦,౦౦,౦౦౦. |
| యువరాజులకు ఏటేట ... ... | ౧౨,౧౯,౦౦౦. |
| జనరల్ పరిపాలన ... ... | ౪౬,౫౫,౦౦౦. |
| మనసబులు ... ... | ౧౮,౯౨,౦౦౦. |
| సైన్యముపైవ్యయము ... ... | ౮౬,౭౧,౦౦౦. |
| న్యాయస్థానములు ... ... | ౨౨,౪౮,౦౦౦. |
| పోలీసు ... ... | ౬౭, ౭౨,౦౦౦. |
| విద్యాశాఖ ... ... | ౧౦౬, ౪౩,౦౦౦. |
| వైద్యశాఖ ... ... | ౨౯,౯౯,౦౦౦. |
| వ్యవసాయశాఖ ... ... | ౧౦, ౦౭,౦౦౦. |
| పశువైద్యశాఖ ... ... | ౫,౮౦,౦౦౦. |
| పురపాలకసంఘాలు మరియు ఆరోగ్యశాఖ ... ... | ౨౬,౦౮,౦౦౦ |
| ఆబ్‌పాషిశాఖ ... ... | ౨౭,౬౩,౦౦౦. |
| పరిశ్రమలు ... ... | ౩,౪౨,౦౦౦. |
| యుద్ధనిధికిసహాయము ... ... | ౨౪,౮౮,౦౦౦. |
| భవనాలు, రోడ్లు, ... ... | ౮౬,౫౮,౦౦౦. |
| సహకార సంఘాలు ... ... | ౪,౫౫,౦౦౦. |

పై సంఖ్యలను విమర్శనదృష్టితో పరిశీలించిన ఇవి మన రాష్ట్రమందుగల పరిస్థితులు, ప్రజల అవసరములు, దారిద్ర్యమును, అభివృద్ధిని దృష్టియందుంచుకొని గావింపబడలేదని స్పష్టమగుచున్నది. ప్రజల అభివృద్ధికారణములగు జాతీయ నిర్మాణశాఖలపై మిగుల స్వల్ప

మైన మొత్తములు మాత్రమే వ్యయము గావింపబడుచున్నవి. ప్రజల దృక్పథముతో అనవసరమైనట్టి వ్యయములెన్నియో గావింపబడుచు, జాతీయ నిర్మాణశాఖలు ఉపేక్షింపబడుచున్నవి. పోలీసుశాఖపై ౬౭ లక్షల మొత్తము వ్యయముజేయుచు, ప్రజల ఆరోగ్యముగాపాడు వైద్యశాఖపై ముప్పది లక్షలు మాత్రమే వ్యయము గావించుట యందున్న తత్వమును మీరే గ్రహించుకోవలయును.

ఈ ఆయవ్యయముల నిర్మాణమునందు మన రాష్ట్రమునందలి జనసామాన్యమునకు జెందినట్టి ముఖ్యాతి ముఖ్యమైన దారిద్ర్యసమస్య పరిష్కారమును దృష్టియందుంచుకోబడలేదు. దారిద్రక్షుద్బాధలు, హిందూ జనసామాన్యము నేవిధముగా బాధించుచున్నవో,మహమ్మదీయ, క్రైస్తవ జనసామాన్యమునుగూడా అదే విధముగా బాధించు చున్నవి. ప్రభుత్వమువారిచే నిరుద్యోగమును (unemployment) మరియు స్వల్పఉద్యోగమును (under employment) దూరము జేయుటకై ఏమాత్రము ప్రయత్నము గావింపబడలేదు. పరిశ్రమాభివృద్ధికై మూడులక్షల నలుబదిరెండువేల రూపాయీలు మాత్రమే వ్యయము గావించు పరిపాలనావిధానమునందీ సమస్యాపరిష్కార మెట్లుజరుగును?

జాతీయ నిర్మాణశాఖలపై వ్యయము గావింపబడు స్వల్పమొత్తములుగూడా అన్నివర్గముల వారికి సమముగా జెందుటలేదు. ఎక్కువ మొత్తము ధనికవర్గము వారికిని, పరిపాలక వర్గము వారికిని లాభదాయక మగునట్లు వ్యయము జేయబడుచున్నవి. బీదలు తగినంత లాభపడుట లేదు. ఆరోగ్యవిద్యా సౌకర్యము లెక్కువగా ధనిక పరిపాలక వర్గములవారుండే పట్టణ స్థలములయందే ఏర్పాటు గావింపబడినవి. పట్టణముల పునఃనిర్మాణము నందును, పరిశుభ్రతయందును, రోడ్డులు వేయుట యందును బీదవారి గుడిసెలు (Slums)బొత్తిగా ఉపేక్ష జేయబడు చున్నవి. ఇతర శాఖలన్నిటియందును ఇదే విధాన మవలంభింప బడు చున్నది.

ప్రభుత్వోద్యోగులవేతనములు.

ప్రభుత్వోన్నతోద్యోగుల (gazetted officers) వేతనములు విపరీతముగానుండి ఎంతయో మొత్తము మిగులుచున్నవి. ప్రభుత్వము వారు ప్రకటించిన సివిలు లిస్టుమొదలగు వానిలోని సంఖ్యలను పరికిస్తే కనీసము రెండుకోట్ల రూపాయీలైన ఉన్నతోద్యోగుల వేతనముల క్రింద నే వ్యయమగుచున్నదని తేలినది. మనప్రధానామాత్యునికి మాసమునకు ఎనిమిదివేల కల్దారు రూపాయల వేతనము. బాబెహాదుకూ మతు ఇతర సభ్యులకు మూడువేలకు తక్కువగా గాని వేతనములు మనప్రభుత్వాదాయమును, మన ప్రజల దారిద్ర్యమును దృష్టియందుంచు కొని పరిశీలించిన ఈ సంఖ్యలు మిక్కిలి అధికముగానున్నవి.

ఉదాహరణముగా ఈసంఖ్యలను జపాను దేశమునందలి సంఖ్యలతో పోల్చిచూచినచో ఉన్న తారతమ్యమును మన కాశ్చర్యము కలిగింపక మానదు. జపాను దేశము భారతదేశముకంటె మిగుల ధనవంతమైనది. అచ్చట ప్రధానామాత్యునికి, మన ప్రధానా మాత్యునికన్న ఎన్నియో రెట్లధిక బాధ్యతగలదు. కాని జపాను ప్రధానామాత్యుడు, మాసమునకు రు ౬౨౨-౦-౦ మాత్రమే వేతనముగా గైకొంటాడు. ఇతర జపాను మంత్రుల వేతనము ౪౪౦-౦-౦ రూపాయీలుమాత్రమే. జపానుప్రధానా మాత్యుడు ఒక సంవత్సరమునందు గైకొన్న వేతనముకంటె నెక్కువగా మన ప్రధానామాత్యుడు ఒక మాసమునందే గైకొనుచున్నాడన్న మాట.

ఈవిషయాలు మనవి జేయుటవలన మన బాబెహాదుకూమతు సభ్యులను నేను వ్యక్తిపూర్వకముగా విమర్శించినట్లుగా తలచరాదు. మన ఉన్నతోద్యోగముల వేతనావిధానము నందుండు లోపములు జూపించునప్పుడు తప్పనిసరిగా ఈ సంఖ్యలీయవలసివచ్చినది. వారువ్యక్తి పూర్వకముగా మంచివారే వుండవచ్చును. వారు గైకొనుచున్న వేతనములోని ఎంతయో భాగము వారు దానధర్మములకై వినియోగించు చుండవచ్చును.

ఇట్టి అధికమైన ప్రభుత్వోద్యోగుల వేతనాలు దరిద్రులమగు మనము భరింపలేమని మనప్రభుత్వము వారికి తెలియకపోలేదు. ఐనను మనము పట్టుదలతో ప్రభుత్వమువారికి తెలుపవలసివున్నది. మన దారిద్ర్యమునకు తగినట్లే మనము మన ప్రభుత్వోద్యోగుల వేతనము లుండవలయును. మాసమునకు ౫౦౦ రూపాయీలకంటె అధికంగా మనప్రభుత్వ విధానమునందేఉద్యోగికి నీయబడగూడదని మనము కోరవలసియున్నది.

ప్రభుత్వాదాయ విధానము.

ప్రభుత్వాదాయమంతా నేడు బీదప్రజలే చెల్లించుచున్నారు. జాగీర్దార్లు, సంస్థానాధీశులు, సాహుకార్లు, వేలు వేతనాలుగా పొందు ప్రభుత్వోద్యోగులు ప్రభుత్వ ఆర్థిక భారమునందు మిగుల స్వల్పముగా మాత్రమే భరించెదరు. పన్నుల భారమంతయు జనసామాన్యమే చెల్లించుచున్నది. మాల్గుజారి పన్ను జనసామాన్యమే చెల్లించుచున్నది. ఆబ్కారిపన్ను అత్యధికముగా వారిపైననే బడుచున్నది. కరోడ్గిరి ప్రత్య క్షంగా వర్తకులు చెల్లించినప్పటికి, పరోక్షంగా జనసామాన్యముపైననే పడుచున్నది. రైల్వే ఆదాయముగూడా ఇదేవిధముగ వచ్చుచున్నది. ధనికవర్గముపైన ఆదాయము మరియు ఇతర పన్నులువేసి, జనసామాన్య ముపైనుండు ఆర్థికభారము తగ్గించుటకై ప్రభుత్వమువారు వాగ్దానము గావించియున్నారు. అదిసత్వరముగా అమలులో తెచ్చుటకై ప్రయ త్నించవలసియున్నది.

రైతు సమస్య.

మనది వ్యవసాయదేశము. మన ముత్పత్తిగావించు సంపతియందు ఇంచుమించుగా అంతయును వ్యవసాయవృత్తికి జెందినట్టిదే. జనసంఖ్య లోని నూటికి డెబ్బదిభాగములు వ్యవసాయ వృత్తిపైన ప్రత్యక్షముగా ఆధారపడువారే. ఇతరులుగూడా పరోక్షముగా రైతుపైన నాధారపడి జీవించువారే. రైతు దేశమునందలి సంపదయంతయును ఉత్పత్తి జేయు చున్నప్పటికిని, అధికభాగము ఇతరు లనుభవించుటచే అతని భాగమునకు

దారిద్ర్యమే మిగులుచున్నది. ఆసంఘముయొక్క అర్థిక భారమంతయు ఇదివరకే బలహీనమైయున్న అతని భుజములమీద బడుటచే అతడు కృంగికృశించి పోవుచున్నాడు. ప్రభుత్వమువారు వసూలుజేయు పన్నులు, ప్రభుత్వోద్యోగుల అధిక వేతనాలు, పెట్టుబడిదారు అనుభవించు అధిక వడ్డీలు, జాగీర్దార్ల వైభవములు, లక్ష్మీపుత్రుల సౌఖ్యములు, విద్యాధికుల విజ్ఞానము -ఇవిఅన్నియును ఎట్లుకల్గుచున్నవో ఆలోచించండి. అన్నియును కృషీకునిపాటునకు మారురూపులుగావా? నేడు దేశమునందు రైతుయొక్క దారిద్ర్య సమస్యయే ముఖ్యాతి ముఖ్యమగు సమస్య.

పారిశ్రామిక విప్లవ (Industrial revolution) ఫలితముగా పూర్వము మనదేశమునందుండు గృహపరిశ్రమలు పెద్దపరిశ్రమలచే పోటీచేయజాలక నశించిపోయినవి. గృహపరిశ్రమల స్థానమవలంబించుటకు వేరే పరిశ్రమలు నెలకొల్పబడలేదు. జనసంఖ్యలో నక్కువభాగము వ్యవసాయముపైననే ఆధారపడవలసి వచ్చినది. ౧౮౮౧ సంవత్సరమున వ్యవసాయముపై జనసంఖ్యలో నూటికి ౫౮ భాగములు మాత్రమే ఆధారపడువారుండిరి. రాయలు కమీషన్ ఆఫ్ అగ్రికల్చరు (Royal commission of agriculture) వారి అభిప్రాయాను సారము ప్రతిశతి ౭౪ గురు గతదశాబ్దమునందే వ్యవసాయముపై మనదేశమునందాధారపడుచున్నారు. పరిశ్రమలు వృద్ధిబొందిన యూరపు దేశములయందు ఈవిషయములు తల క్రిందులుగా జరిగినది. ౧౮౭౫నుండి ౧౯౧౬ వరకు జర్మనీదేశమునందు వ్యవసాయముపై ఆధారపడువారి సంఖ్య నూటికి ౬౧ నుండి ౩౫ వరకుతగ్గినది.

భూమి ఖండఖండములుగా విభజింపబడి పట్టేదార్ల సంఖ్య పెరుగుటచే భూమి బలహీనమై సేద్యమున కయోగ్యమై పోయినది. భూమియంతయును సేద్యమునకై మాత్రమే ఉపయోగింపబడుటచే పచ్చిక బయళ్ల వైశాల్యము తక్కువైపోయి పశుసంతతి సంఖ్యయందును, బలమునందును తగ్గిపోయినది. రోగములువచ్చి అదివరకే బలహీనమగు పశుసంతతి నూర్గ్లు వేలు మరణించునది మనము గ్రామములయందు చూచు

చు నే యున్నాము. మన ప్రభుత్వమువారు పశుచికిత్సకై తగినప్రయత్నము జేయుటలేదు. జనసంఖ్యకంటెను అధికముగానున్న పశుసంఖ్య చికిత్సకొరకై ౫ లక్షల రూపాయీలు మాత్రమే కర్చుజేస్తున్నారు. మనరాష్ట్రమువంటి విశాలదేశమునందు పదునెనిమిది పశుచికిత్సాలయములు మాత్రమే నున్నవని ప్రభుత్వమువారే ప్రకటించినారు.

భూమిని అభివృద్ధిజేయుశక్తి రైతుయొద్ద బొత్తిగాలేకుండ బోవుచున్నది. వంశపరంపరగా రైతుఋణగ్రస్తుడైయుండి, కేవలముఋణము చెల్లించుటకే వ్యవసాయము చేయవలసినగతి అతనికిపట్టినది. ఋణబాధ విపరీతముగా పెరుగుచున్నది.

నాకుపరిచయ మున్నంతవరకు మనరాష్ట్రమునందు నూటికి రెండొందల వంతులు (౨౦౦%) మిత్తికిమిత్తి (compound interest) వసూలు గావింపబడుచున్నది. ఎందరివో బీదరైతుల భూములు పెట్టుబడిదార్ల హస్తగతమై పోవుచున్నవి. అప్పుఇచ్చే అప్పుడును, వసూలు జేయునప్పుడును పెట్టుబడిదార్లు అవలంబించే అవినీతికరమగు పద్ధతులు ప్రభుత్వమువారి ఉపేక్షచే నిర్విఘ్నముగా సాగుచునేయున్నవి.

ప్రభుత్వమువారు వ్యవసాయశాఖపై వ్యయముగావించు మొత్తము మిగులస్వల్పము. ఈ స్వల్పవ్యయముగూడా సరియైన ఉపయోగమునకు వచ్చుటలేదు. లక్షలకొలది వ్యవసాయదారులకు ఇట్టిదొకశాఖ ఏర్పడియున్నదను విషయమే తెలియదు. కొంతవరకు రైతుల అజ్ఞానమే దీనికి కారణమైనప్పటికి వ్యవసాయశాఖవారి కార్యనిర్వహణలోపమే దీనికి ముఖ్యకారణము.

ప్రభుత్వమువారి భూమిపన్ను విధానము రైతుకనుకూలంగా లేదు. ఖుష్కీపన్ను ఎక్కువగానున్నది. తరీపన్ను తెలంగాణమునందు విపరీతముగానున్నది. కొన్నిప్రదేశములయందు ఎకరమునకు ౨౩ రూపాయీలవరకుగూడానున్నట్లు ప్రభుత్వమువారి నివేదికానుసారమే తెలియుచున్నది. బావులక్రింద భూములపన్ను అన్యాయమై, దుర్భరముగానున్నది.

పన్ను నిర్ణయవిధానము నియమబద్ధమై ఉండవలయును. ఉత్పత్తి కర్చులుబోగా రైతుకు మిగులుదానిలో ప్రభుత్వమువారు ఆరవభాగము గైకొనవలయును. పూర్వము ఇటులనే జరుగుచుండెనని చరిత్రలు చాటుచున్నవి.

౧౯౨౯ సంవత్సరము తదుపరి ప్రపంచమును ఆవరించిన ఆర్థిక మాంద్యముచే పంటలదరలు నూటికి ఏబదివంతున తగ్గిపోయినవి. దరలు తగ్గినప్పటికి పన్ను విధానమునందు మాత్రము భేదమేమియుకలుగలేదు. ప్రభుత్వమువారొసంగిన మాఫీలు మిగుల స్వల్పమగుటచే రైతు సమస్యాపరిష్కారము కాలేదు. బావులక్రింది భూముల కొసగబడిన మాఫీలలో అందరూన్ ఆయాకట్, బేరూన్ ఆయాకట్ అను భేదముంచబడుటచే, మిత్రులగు శ్రీ మందుముల నర్సింగరావుగారు వ్రాసినట్లు ఒక హస్తమునుండి మాఫీఒసగుచు, రెండోహస్తముచే తిరిగి లాగుకొనినట్లైనది.

ప్రభుత్వమువారు రైతుకు చౌకవడ్డిచే అప్పులు లభించుటకై సహకార సంఘములు స్థాపించియున్నారు. ఈ సంఘములచే రైతుకు గలిగిన లాభము మిగులస్వల్పము. సహకారశాఖ రైతుసమస్యాపరిష్కారోద్దేశముతో ౧౯౧౩ సంవత్సరమున స్థాపింపబడి, ఇరువది నెనిమిది సంవత్సరములనుండి కార్యనిర్వహణ మొనరించుచున్నప్పటికి అది రైతుల నాకర్షింపజాలలేదు. ౧౩౪౭ ఫసలీయందు ౨౭౩౫ సహకార సంఘములు, మాత్రమే గ్రామములయందు పనిజేయుచున్నట్లు ప్రభుత్వమువారి ప్రకటనలచే తెలియుచున్నది. భారత దేశమునందేమి, మన రాష్ట్రమునందేమి సహకారోద్యమము రైతు సమస్యా పరిష్కారమునందు అపజయము పొందినట్లు ప్రభుత్వమువారే ఒప్పుకొనియున్నారు.

ప్రభుత్వమువారు రైతులకొసగు తఖావీ మొత్తములుగూడా రైతులకు లాభదాయకముగా లేదు. కొద్దిమిత్తితో తఖావీ మొత్తములు లభించునప్పటికి, అవిమిగుల స్వల్పమగుటచే రైతు అవసరములను దీర్పజాలవు. మన మాల్గుజారిశాఖలో లంచగొండితననుండుటచే, రైతు

తనకు తఖావీగా లభించు మొత్తములోనుండి కొంతభాగము లంచముల కొరకును, పైరవీ వ్యయమునకును మొదలే కర్చు చేయవలసి యుండును. ప్రభుత్వమువారు మొన్న మొన్ననే రైతుల లాభమునకై కొన్ని చట్టములు జేసియున్నారు. వాటిని మనవేదికనుండి మనము స్వాగతమొసగి యున్నాము, ఒసగుచున్నాముగూడాను. కాని ఇంతమాత్రమున రైతు దారిద్రసమస్యా పరిష్కారము కలుగజాలదని గత రెండు, మూడు సంవత్సరముల అనుభవమువలన చెప్పవచ్చును. రైతులను ఋణభారమునుండి విముక్తిచేయుటకై ప్రభుత్వమువారు శాసనములద్వారా అవలంబించిన విధానము రైతులకు అనుకొనినంత శ్రేయము చేకూర్చుటకు మారుగా నష్టములే కలిగించినది. అందుచే పెట్టుబడిదారు నూతన శాస్త్రీయ పద్ధతులకులొంగక రైతులకు పెట్టుబడి మానివేసెను. రైతుకు పెట్టుబడి లేకను, ప్రభుత్వ సహకారశాఖవారి పూర్వపు విధానములో మార్పుకలుగక, రైతునకు పెట్టుబడి మిక్కిలి అందుబాటులో లేనందునను రైతు గొంటచెడినవాడైనాడు.

కౌలుదారులస్థితి హీనముగానున్నది. ఒసగబడు మాఫీలన్నియును పట్టేదార్లే అనుభవించుచున్నారు, కౌల్దార్లకు లభించుటలేదు. ఇటుల జరుగకుండాజూచుట ప్రభుత్వ కర్తవ్యము. కౌల్దారులహక్కులను గాపాడుటకై ప్రభుత్వమువారొక చిత్తుశాసనమును శాసనసభయందు ప్రవేశపెట్టియున్నారు. ఏస్వరూపమున అది శాసనరూపము ధరింపనున్నదో ఇప్పుడే ఊహించుటకు వీలులేదు. దీనిచేత కౌల్దారులకు ఎంతవరకు లాభముకలుగనున్నదో గమనించవలసి యున్నది.

వ్యవసాయదారుని స్థితి ఎంతహీనముగ నున్నదో వ్యవసాయకూలీలస్థితి అంతేహీనముగానున్నది. వ్యవసాయకూలి జీవితమంతయును వ్యవసాయదారునిపైననే ఆధారపడియున్నది. రైతుస్థితి బాగుపడనిదే వ్యవసాయకూలి స్థితిగూడా బాగుపడజాలదు.

నేను ప్రప్రథమముననే మనవిజేసినట్లు రైతుయొక్క దారిద్ర్య సమస్యయే మనలను, మన ప్రభుత్వమును ఎదిరించుచున్న ముఖ్యాతి ముఖ్య

మగు సమస్య. నేటి పరిపాలనావిధానము మారనిదే ఈసమస్యా పరిష్కారము గాజాలదను నమ్మకము నాబోటివారి కెందరికో కలదు. నేటి పరిపాలనా విధానమును సమర్థించువారు మొదట ఈ సమస్యా పరిష్కారమును త్వరగానొనర్చి నాబోటివారి నమ్మకము తప్పని నిరూపించి నచో నేను సంతోషించెదను.

దిగువ నుదహరింపబడిన కనీసపుకోర్కెలు మనము మనసంస్థ నిర్మాణకార్యక్రమము ద్వారా పొందుటకు తీవ్రమగుకృషి సలుప వలసియుండును:—

౧. (అ) మన రాష్ట్రమునం దాచరణలోనున్న తరీపన్ను విధానమే చాలా లోపభూయిష్టమును, కఠినమునైయుండ మీదుమిక్కిలి బిలావర్షు పడావాలు, సివాయి జమాబందీలు గ్రామోద్యోగులు, గిర్దావరు మొదలగు తత్శాఖోద్యోగులచే రైతులపై కసిదీర్చుకొనుటకు ఆయుధములుగా ఉపయోగపడుచున్నవి. తరీపన్ను నిర్ణయవిధానములో మదాసు రాజధానిని అనుకరించుట చాలా ఉత్తమము. నీరుసమృద్ధిగా దొరుకుచోట, భూమిపై శాశ్వత ఖుష్కీపన్ను నిర్ణయించి,నీటి ఉపయోగముపై నీటిపన్ను విధింపబడవలయును. దీనివలన రైతుకుండే జమాబందీ కష్టములు చాలావరకు యీడేరును.

(ఆ) మన రాష్ట్రములోని భూములు పరిసర బ్రిటిషుప్రాంతముల భూములకన్న సారహీనమైనవైనను పన్నుమాత్రము హెచ్చుగనే యున్నది. కాబట్టి తరీపన్నుకనీసము సగమువరకైనను తగ్గించబడవలయును. ఎంతటి ఉత్తమోత్తమ భూమిపైనను, ఎట్టిపరిస్థితులయందును ఎక్కువలో ఎక్కువ ఎకరమునకు ఎనిమిది రూపాయీలు విధించినచాలును.

(ఇ) ఖుష్కీ భూములపై ప్రస్తుతమున్నపన్నులో మూడోవంతైనను తగ్గింపబడవలయును.

(ఈ) పాత, క్రొత్త, అందరూన్ ఆయాకట్, బేరూన్ ఆయాకట్ అనుభేదములను పాటింపక, ప్రతి బావిపొలపు పరిసరపు ఖుష్కీ భూముల ధారాయే తీసుకొనవలయును.

(ఉ) పర్రెకాలువలు రైతు యొక్క శ్రమ ఫలితముగనే సాగును గనుక వీనికిక్రింది తరీభూములపై ఉత్తమ ఖుష్కీధారా మాత్రమే తీసు కొనవలయును.

౨. రైతునకు వ్యవసాయోత్పత్తి వృద్ధిజేసికొనుటకు అన్ని విధ ములైన హక్కులుండవలయును. ప్రభుత్వాజ్ఞతో పనిలేకనే, పట్టాభూ ములలో చెరువులు, కుంటలు, బావులు, నిర్మించుకొనుటకును, పర్రెకా లువలు త్రోడుకొనుటకును అధికారము లుండవలెను.

ఇట్టి అభివృద్ధివలన కలుగు ఫలితము అధికపన్ను లేకుండా రైతు నకు చెందితీరవలయును. దీనిచే ప్రభుత్వ నీటివసతుల కాటంకము గలిగి నటుల ప్రభుత్వమువారు రుజువుచేసిన తప్ప రైతునకు అన్నివిధములైన నీటివసతి ఏర్పాటు జేసికొనుట కధికారముండవలయును.

౩. ప్రభుత్వమువారు ప్రతి ఇరువది, ముప్పది సంవత్సరములకు బందోబస్తుచేయు విధానముచే రైతుపైపడు పన్నుఅధిక్యతనుండి అతడు విముక్తిపొందుటకై శాశ్వత బందోబస్తు విధాన మవలంబించుట అవ సరము.

౪. పట్టా భూములలో ఉండే అడవులపైనను, ఫలవృక్షాదుల పైనను రైతునకు సంపూర్ణాధికార ముండవలయును. ఆబ్కారి చెట్ల నుండి కల్లు, సారాయి తీయించుకొను అధికారముతప్ప చెట్లను పెంచు టకు, కొట్టివేయుటకు మద్రాసు రాజధానియందమలులోనున్న సిస్టము ప్రకారమే రైతుకు హక్కుండవలయును.

౫. వ్యవసాయ పనిముట్ల కవసరమగు ప్రతివస్తువు అడవుల నుండి రైతులకుచితముగా లభించవలయును. బీదరైతులకు గృహానిర్మా ణమునకు వలయు కలపగూడా ఉచితముగా లభించవలయును. అడవులలో నుండే కంచెలు (పచ్చికబైళ్లు) వేలముచేయుటకు మారు రైతు పశువు లకై ఉచితముగా వదిలివేయవలయును.

౬. భూమి ముంతఖిల్ చేయు పద్ధతులు చాలా వ్యయములతో కూడుకొనియున్నవి గనుక ప్రభుత్వమువారు మదరాసు రాజధానిలోని విధానాన్ని అనుకరించవలయును.

౭. రైతు ఋణబాధవలన కృంగి కృశించి పోవుచున్నాడు. కాబట్టి ప్రభుత్వమువారు తీవ్రంగాఆలోచించి ప్రస్తుతముండు ఋణబాధా నివారణోపాయముల నన్వేషించుటయేగాక, తక్కువ వడ్డీతో, ఎక్కువ కాలముకై రైతు అవసరములు తీర్చునంత మొత్తములిచ్చు ప్రభుత్వ బ్యాంకులు స్థాపింపబడవలయును.

౮. వ్యవసాయశాఖ రైతు అభివృద్ధి దృష్టియందుంచుకొని, శ్రేయోదాయక పద్ధతులపై సంస్కరింపబడవలయును.

౯. కౌలుదార్ల హక్కులను రక్షించు చట్టమును ప్రభుత్వము వారు వెంటనే శాసించవలయును.

౧౦. (అ): జాగీర్లలోని భూమిపన్ను ఖాల్సాలోవలెనే ఉండవలయును. ఎక్కువలోఎక్కువ మూడు సంవత్సరముల కాలములో ఖాల్సా ప్రభుత్వమువారి ప్రత్యేకశ్రద్ధపై—బందోబస్తు వ్యయములు రైతుపై మోపబడక, జాగీర్దారే భరించునట్లు జేసి,—మూడు సంవత్సరములోపల బందోబస్తు జరుగకపోయినచో ప్రభుత్వమువారు కఠినచర్య గైకొనవలయును.

(ఆ): జాగీర్లలోని అక్రమ పన్నులన్నియు తక్షణమే రద్దుచేయబడవలయును.

(ఇ): జాగీర్దార్లకుండబడే పోలీసు, మాలు, అదాలతు అధికారాలు ప్రభుత్వపరమై యుండవలయును.

(ఈ): జాగీరు ప్రజాహిత కార్యములకగు వ్యయము జాగీర్దారు నుండే గైకొని, ఖాల్సాలోమాదిరిగ ప్రభుత్వమే వ్యయముచేయించవలయును.

13/26

పౌరస్వత్వములు.

ప్రభుత్వమువారు పౌరస్వత్వముల గురించి అభివృద్ధికరమగు విధానమవలంబించుటలేదు. సభలు సమావేశపరచుటకు నేటికిని ప్రభుత్వాజ్ఞ గైకొను నిర్బంధము అమలులోనే యున్నది. సభలకు అనుజ్ఞనొసగుటయందు పది సంవత్సరముల క్రితమేవిధాన మాచరణయందుండెనో నేడు గూడ అదేయున్నది. సుప్రసిద్ధమగు నిషాను (౫౩) గష్తీ మారువేష

ముతో తనశక్తిని మనకు యెల్లప్పుడును గనబరచుచునే యుంటుంది. అనుజ్ఞ నొసగబడుసభలకు షరతులు విధింపబడుచునే యున్నవి. మొదలే మనవి జేసినటుల నల్లగొండ, వరంగల్లు జిల్లాల మహాసభలకు ప్రభుత్వము వారు విధించిన షరతులు చాలా విచిత్రముగాను, విపరీతముగా నుండుటచే మనమా సభలను సమావేశపరుప నిరాకరించితిమి. ఈ మహాసభకు అనుజ్ఞనొసగుచు రాష్ట్రేతరుడు అధ్యక్షత వహించగూడదనియు, మహాసభలో రాష్ట్రేతరులెవరును ఉపన్యసింపగూడదనియు షర్తులు విధింపబడినవి. ప్రభుత్వమువారి ఈచర్య సహేతుకముగా లేదు. రాష్ట్రేతరులను ప్రభుత్వోద్యోగములలో విరివిగా నియమించుచు, ప్రభుత్వ కార్యనిర్వాహణమునందు రాష్ట్రేతరుల సహాయము బొందుచు, ప్రజాహిత కార్యములయందు మాత్రమే రాష్ట్రేతరులను నిషేధించుటయందుండు తత్వమును నేను గ్రహింపజాలకున్నాను.

పత్రికా స్వాతంత్ర్యముగూడ వాక్స్వాతంత్ర్యము వలెనే నిరోధింపబడుచున్నది. ముఖ్యముగా దేశభాషలలో పత్రికా ప్రకటనకు అనుజ్ఞదొరుకుట కష్టసాధ్యమై పోవుచున్నది. పత్రికల కనుజ్ఞ నొసగునపుడు అభివృద్ధికరమగు విధానమవలంబించుటకు బదులు వ్యక్తులను, వ్యక్తుల యభిప్రాయములను బట్టి అనుజ్ఞ నొసగబడుచున్నది.

స్టేటు కాంగ్రెసుపై నిషేధమును తొలగించుచు ఒసగబడిన లిఖితపూర్వకమైన వాగ్దానము సంపూర్తింపబడలేదు. రాష్ట్రమునందలి ఏడుగురు స్వాతంత్ర్యవీరులు ఈనిషేధమును తొలగించు నుద్దేశముతో నేడు కారాగారశిక్షను అనుభవించుచున్నారను విషయము మనము మరచిపోగూడదు. విచారణ లేకయే యెందరో దేశసేవకులు నిర్బంధింపబడుచున్నారు. ఆంధ్రమహాసభ కార్యకారిణీ సభ్యులలో నొకరగు శ్రీయుత బద్దం యెల్లారెడ్డిగారు యెట్టి విచారణలేకయే దిగ్బంధనములో నుంచబడిరి. రైతు సేవకులగు శ్రీ. పైడిపల్లి హనుమయ్య చౌదరీగారుగూడ యిదే విధముగ నిర్బంధింపబడియున్నారు. అదాలతుయందు బహిరంగముగా విచారింపబడి, నిర్దోషులుగా ఎంచబడిన యిద్దరు ఖమ్మము యువకులు తిరిగి అరెస్టుగావింపబడిరి.

ఈ నిరోధములన్నియు దేశమునందు పనిజేయుచున్న అభివృద్ధి శక్తులకొరకు మాత్రమే ఉద్దేశింపబడినట్లగపడుచున్నది. మతపాక్షిక తత్వములకులోనై, వివిధ మతావలంబకులలో విద్వేషముల పెంచు ప్రతీకార శక్తులు విచ్చలవిడిగా కార్యనిర్వహణ మొనరించుచున్నప్పటికి వాని కాటంకముల నేవియు కల్పింపబడకపోవుట మన కనుభవసీయమె.

జా గీ రు ప్ర జ లు.

జాగీరుప్రజల స్థితి ఖాల్సా ప్రజలకంటెను హీనముగానున్నది. ప్రజలొసగు పన్నుయంతయు తమస్వంత వ్యయముల కే ఉపయోగించుట కని నూతన సిద్ధాంత మొకటి జాగీర్దారుల సంఘమువారు ప్రకటించినారు. వీరు తమ జాగీర్ల ఆయవ్యయములను ప్రకటింపరు. ఖాల్సా ప్రజలు చెల్లించు పన్నులకంటె ఎక్కువపన్నులు జాగీరు ప్రజలచే వసూలు గావింపబడుచున్నవి. ఎన్నియో జాగీర్లయందు బందోబస్తు గావింపబడక, పూర్వకాలపు గుండు గుత్తాధాన్యపుకొల్లే వసూలు గావింపబడుచున్నవి. ఈ ఇరువదియవ శతాబ్దమునందుగూడా బందోబస్తుగాని ప్రదేశములుండుట దుఃఖింపవలసిన విషయము. బందోబస్తు జేయించు ప్రయత్నము అతిజాడ్యముగా జరుగుచున్నది.

చట్ట విరుద్ధమగు పన్నులెన్నియో వసూలు గావింపబడుచున్నవి. అదాలతు, పోలీసు అధికారములు జాగీర్దారులకుండుటచే వాటిని జాగీర్దారులు దుర్వినియోగము జేసి అక్రమపన్నులు వసూలు జేయుటయందుపయోగిస్తున్నారు. వీటినన్నిటిని తక్షణమే ప్రభుత్వమువారు కఠినమగు చర్యగైకొని ఆపివేయవలయును. గత ఆంధ్రమహాసభాధ్యక్షులవారు జిల్లాల పర్యటన సందర్భమున ఎన్నియో జాగీర్లయందును, సంస్థానములయందును ఇట్టి అక్రమమైన పన్నులు వసూలు గావింపబడుచున్నట్లు తెలిసికొని ప్రకటించిరి.

జాగీర్లలో విద్యాభివృద్ధి, వైద్యసహాయము మిక్కలి అసమంజసముగా నున్నది. జాగీర్దారులు జాతీయ నిర్మాణ కార్యములపై ఏమియు వ్యయము జేయరు. కొందరు మిగులస్వల్పముగా మాత్రమే చేయుదురు.

ప్రభుత్వమువారు జాగీర్ల విషయములో ఎక్కువగా శ్రద్ధ గైకొనవలయును. ఖాల్సాయందుగల పరిపాలనా పరిమాణము జాగీర్లలో నుండునట్లు సత్వరముగా చర్య గైకొనవలయును.

వె ట్టి చా కి రి.

ప్రతిఫలమీయనిది వెట్టిచాకిరి చేయించుకొనుట — ఎన్నియోసంవత్సరములక్రింద ప్రభువుగారి ఫర్మానుద్వారా స్పష్టమైన నిబంధనలతో - నిషేధింపబడినప్పటికిని, బీద ప్రజలచే ప్రతిఫలమీయకయే వెట్టిచాకిరి జేయించుకొనుట నేటికి సహజముగా గ్రామములయందు జరుగుచునే యున్నది. ఈ నిషేధాజ్ఞను కఠినముగా అమలుబెట్టుమని ఎన్నియో పర్యాయములు ఆంధ్రమహాసభ ప్రభుత్వమువారినికోరినప్పటికిని ఫలితము కలుగలేదు. గ్రామములయందు బీదప్రజలీ వెట్టిచాకిరిచే నెటుల బాధింపబడుచున్నారో గ్రామ జీవితముతో సంబంధముగల వారందరును ఎరుగుదురు. ఈ నిబంధనలు కఠినముగా అమలుజరిపించుటకు ప్రభుత్వము వారిని కోరుటయేగాక ఆంధ్రమహాసభ నిర్మాణ కార్యక్రమములో దీనిని ఒక ముఖ్యాంగముగా జేర్చికొని నిబంధనలు అమలులో నుండునట్లుగా మహాసభ పక్షమున మనము ప్రయత్నముజేయుట అత్యంతావసరమని నేను సూచించుచున్నాను.

వెట్టిచాకిరికి సంబంధించిన వేరొక విషయము మీతో మనవిజేయ బోతున్నాను. ప్రభుత్వమువారు గావించిన వెట్టిచాకిరి నిబంధనలలో బలోతాదార్లచే నిర్బంధముగా ప్రతి ఫలమిచ్చి పనిదీసికొనుట కవకాశ మేర్పరుపబడియున్నది. ప్రతిఫల మిచ్చినప్పటికీ ఇష్టములేనిదే ఒకనిని నిర్బంధించుటగూడా ఒక విధమైన బానిసత్వము (Slavery) అని నేను భావిస్తున్నాను. పర్యటనమునందు ప్రభుత్వోద్యోగులగు వారి మూటలు మోయుటకును, ఇతర అవసరములను దీర్చుటకును కూలీలను లభింపజేయుటకై ఇట్టి నిర్బంధ విధానమేర్పరుపబడియుండవచ్చును. కాని నేడట్టి అవసరము లేమియు నాకగపడుటలేవు. దరిద్రము, నిరుద్యోగము గ్రామములయందు విచ్చలవిడిగా విహరించుచున్నది. తగు ప్రతిఫల మొసగినచో ఎందరో పనిజేయుటకు

సిద్ధముగా నుండెదరు. సిద్ధాంతరీత్యా, ఆచరణరీత్యా ఈ నిర్బంధము అన్యాయమనియును, అనవసరమనియును నేను భావిస్తున్నాను.

మనవిద్యా సమస్యలు

మనవిద్యా సమస్యలలో అన్నిటికంటెను ముఖ్యమైనది జనసామాన్యముయొక్క విద్యా సమస్య. గత దశాబ్దమునందు వ్రాయను, చదువను నేర్చిన వారిసంఖ్య ప్రతిశతి ఐదునుండి పదివరకు పెరిగినందులకు కొందరు అల్పసంతోషులు సంతోషము గనబరచుచున్నప్పటికి నిజముగా దీనియందట్టి విషయమేమియు నాకగపడుటలేదు. ప్రపంచమునందెన్నియో దేశములయందు, పది సంవత్సరములలో తమ దేశములయందున్న నిరక్షరాస్యతను సంపూర్ణముగా నిర్మూలించిన ఉదాహరణములు గలవు. ఒక దశాబ్దము సామాన్యమైన కాలపరిమితిగాదు. పట్టుదలతోను, ఏకోద్దేశముతోను కార్యనిర్వహణ మొనరించిన ఒక దశాబ్దమున దేశముయొక్క పరిస్థితి తారుమారు గావించవచ్చును.

మన రాష్ట్రమునందు గ్రామములసంఖ్య ౨౧౮౩౦. వీనిలో నేటికిని ౧౮౦౦౦ కంటెను అధికసంఖ్యగల గ్రామములయందు ప్రభుత్వ పాఠశాలలు నెలకొల్పబడలేదు. మన ప్రభుత్వమువారు ఒకకోటికంటె నెక్కువ మొత్తము విద్యాశాఖపై వ్యయము గావించుచున్నప్పటికి దానిలోనుండి ఎక్కువభాగము ఉన్నతవిద్యకై ఉపయోగింపబడుచు, ౨౮ లక్షల రూపాయీలు మాత్రమే ప్రాథమికవిద్యపై కర్చగుచున్నది. ఒకవేయి జనసంఖ్యగల అన్ని గ్రామములయందును ప్రాథమిక పాఠశాలలు నెలకొల్పు క్రొత్త ప్రణాళికవలన గూడా నిరక్షరాస్యత సమస్యా పరిష్కారము కాజాలదు. ఈసమస్యా పరిష్కారము నిర్బంధ ప్రాథమిక ఉచిత విద్యావిధానముతోనే జరుగగలదు.

ఉన్నతవిద్యగూడా శక్తిగలవారందరికిని అందుబాటులో ఉంచబడలేదు. ఉస్మానియా విశ్వవిద్యాలయమునకు జెందినట్టి కళాశాలలయందును, నైజాం కాలేజియందును విద్యార్థుల సంఖ్యాపరిమితి ఏర్పరుపబడు

టచే ఎందరో రాష్ట్రేతర విశ్వవిద్యాలయముల శరణుజొచ్చి ఉన్నత విద్య నభ్యసించవలసి వస్తున్నది.

మన విద్యా విధానమునందు ప్రాంతీయ భాషలగు ఆంధ్ర, మహారాష్ట్ర, కర్ణాటక భాషలకు సరియైన స్థానమొసగబడలేదు. ఉస్మానియా విశ్వవిద్యాలయ ఆదర్శము ప్రజల మాతృభాషలద్వారా ఉన్నత విద్యగరుపుట యైనప్పటికిని, అట్టి గౌరవము ఉర్దూకుమాత్రమే లభింపజేయుట పక్షపాతము. ఉన్నత విద్యయంతయు ప్రజల మాతృభాషల యన్నిటియందును ఒసగుఏర్పాట్లు గావింపబడవలసి యుండెను. ఏదేని కారణమున ఇది అనాచరణయోగ్యమని తలంచిన, అప్పర్ సెకెండరీ (మెట్రిక్ పరీక్ష) (Upper secondary) వరకైనా కనీసము ప్రజల మాతృభాషలన్నిటిలో విద్యగరపు ఏర్పాటుగావింపబడవలసి యుండెను. అట్లొనరింపక ప్రభుత్వమువారు తాము స్వయముగా ప్రకటించిన ఉస్మానియా యూనివర్సిటీ ఆదర్శమునకే భంగము వాటిల్లజేయుచున్నారు. ప్రజలు తమ మాతృభాషను ఇతర భాషలన్నిటికంటెను ఎక్కువగా ప్రేమించెదరు. వారిది పవిత్రమైనప్రేమ. ఈ ప్రేమయొక్క పవిత్రతయే వారిని ఇతర భాషలపై గౌరవదృష్టితో జూచునట్లు జేయువలయును. అటులొనరించిన ప్రజలు తమ మాతృభాషపై చూపుప్రేమను ఉర్దూ భాషా ద్వేషభావముగా ఎంచుట అన్యాయము.

విద్యార్థులు.

మన రాష్ట్రమునందలి విద్యార్థులలోగూడా కొంతకాలమునుండి గొప్ప సంచలనమేర్పడినది. కాని వీరు దురదృష్ట వశాత్తున మనరాష్ట్రమును ఆవరించియున్న మతపాక్షిక వాతావరణముచే ప్రభావితులై తమ పవిత్ర యువక హృదయములను అపవిత్రమును, అనర్థదాయకమును జేసికొనుచుండుట మిక్కిలి విషాదకరమగు విషయము. విద్యార్థుల లోని ఇట్టి వైఖరిచే రాష్ట్రమునందలి అభివృద్ధికరమగు ఉద్యమములకు అపారమైన నష్టము కలుగుచున్నది. దీనిని విద్యార్థులును, దేశనాయకులును, గమనించి నివారణోపాయములను తీవ్రంగా ఆలోచింపవలయును.

విద్యార్థులలోగల శక్తియంతయు అభివృద్ధికర ఉద్యమములకై మాత్రమే ఉపయోగపడునట్లుగా నిర్మాణించుట అత్యంతావసరమని నేను భావిస్తున్నాను.

విద్యార్థులు స్వయముగా ప్రతీకారమునకు దారితీయు మతపాక్షిక అభిప్రాయములను వదలి, తమనిర్మాణశక్తిని అభివృద్ధి గావించుకోవలయును. ప్రపంచములోని ఇతర దేశాలల్లో విద్యార్థులు తమ నిర్మాణ శక్తిని అభివృద్ధిగావించుకొని మానవ సమాజోన్నతికేవిధంగా కృషిపలుపుచున్నారో తెలిసికొని దానినుండి మన విద్యార్థులు గుణపాఠములు నేర్చుకోవలసియున్నది. చీనా దేశమునందు—ప్రస్తుతము ఆ దేశము జపానుసామ్రాజ్య తృష్ణను నిరోధించుచు జరుపుచున్న స్వాతంత్ర్య సమరమునందు—చీనావిద్యార్థులు అపారమైన ధైర్యస్థైర్య త్యాగములతో గైకొనుచున్న భాగమును నేను ఉదాహరణరూపముగా మన విద్యార్థి సోదరుల కొసగుచున్నాను.

ఇప్పుడు మన రాష్ట్రమునందు ఎన్నియో విద్యార్థిసంఘములు ఉత్పత్తిజెంది పనిజేయుచున్నవి. ఈసంఘముల శక్తినంతయును కేంద్రీకరించి, సక్రమమైన మార్గమున కార్యనిర్వహణ మొనరింపజేయ కేంద్రసంఘమొకటి లేకుండుటచే విద్యార్థి ఉద్యమము బాగుగా అభివృద్ధిజెందుటలేదు. ఇట్టి కేంద్రసంస్థయొకటి అత్యంతావసరమని భావిస్తున్నాను. ఈకేంద్రీకరణ మతపాక్షిక తత్వములపైగాక, శుద్ధజాతీయ పునాదులపై నిర్మాణింపబడవలయును. అట్టి కేంద్రీకరణమునకై విద్యార్థులందరును పరస్పర సహకారము సలుపవలయును. ఇందుకై వారభివృద్ధిపరచుకొన్న కొన్ని మానసికతత్వములుగూడా త్యజింపవలసి ఉండును.

### జన సామాన్యముయొక్క ఆరోగ్యము.

మనరాష్ట్రపు జనసామాన్యముయొక్క ఆరోగ్యము క్షీణించుచున్నది. శాస్త్రపూర్వకమైన వైద్యసహాయము, పుష్టినొసగు ఆహారము లభించక రోగములు, ముఖ్యముగా అంటురోగములు (Epidemics) వచ్చినప్పుడు చీమలతుక్కువలె ప్రజలు మరణించుచున్నారు. గ్రామము

లయందు బాలెంతలు ప్రసవసమయమున సరియైన మంత్రసానులును, వైద్యసహాయమును లభించక దిక్కులేనిచావు చస్తున్నారు. జననమొందిన శిశువులలో నెందరో పురిటిలోనే మరణించుచున్నారు.

మన ప్రభుత్వమువారు గావించు వైద్యసహాయము అసంతృప్తికరముగానున్నది. ప్రభుత్వమువారు ప్రకటించిన ౧౩౪౮ ఫసలీ నివేదిక ప్రకారము ౧౫౧ స్థిరమైన వైద్యశాలలు నెలకొల్పబడియున్నటుల తేలినది. మనరాష్ట్రపు వైశాల్యము ౮౨౬౯౮ చదరపుమైళ్లు. ౫౪౮ మైళ్లకొక వైద్యశాల నెలకొల్పబడియున్నదని దీనివల్ల తేలుచున్నది. ఇవి మనరాష్ట్రపు అవసరములను ఏమాత్రము సంపూర్తింపజాలుటలేదు. పదివేల జనసంఖ్యకొక వైద్యశాల నెలకొల్పబడనిది జన సామాన్యమునకు సరియైన వైద్యసహాయము లభింపజాలదు.

స్త్రీ స్వాతంత్ర్యము.

జనసంఖ్యలోని అర్ధభాగమగు స్త్రీలందరును వెనుకబడియుండి విద్యావిహీనులై అజ్ఞానులైయున్నప్పుడు మనరాష్ట్రము అభివృద్ధిగాంచజాలదు. తల్లులయందు ధైర్య నిపుణతలేనిదే ఆగుణములు సంతానమున కలవడవు. భారతదేశము నందేమి, ఇతర దేశములయందేమి మొత్తముమీద మానవసమాజమునందు స్త్రీలు మిగుల దుస్థితికి పాల్పడియున్నారు. మననాగరికత, శాస్త్రములు, ఆచారములు, చట్టములు అన్నియు పురుషునిచేతనే గావింపబడినవి. పురుషుడు స్వార్థపరుడై సంఘమునందున్నతస్థానము నాక్రమించుకొని స్త్రీని ఒక వినోదవస్తువుగ పరిగణించి తన సౌఖ్య సంతోషలాభములకై వినియోగించుకొనుచున్నాడు. పురుషుని అధికారమునకులోబడి పోవుటచేతను, సంఘమునందలి అవకాశములు పురుషునితో సమానముగా ఆమెకు లభింపక పోవుటచేతను ప్రకృతిసిద్ధములగు ఆమెశక్తులు సంపూర్ణముగా విజృంభింపజాలక పోయినందున ఆమె వెనుకబడియున్నదను నేరము పురుషుడే ఆమెపై మోపెను.

పాశ్చాత్య దేశమునందలి స్త్రీలు మెల్లమెల్లగా కొంత స్వాతంత్ర్యముబొందుటయందు విజయవంతులైరి. మనదేశమునందలి నారీమ

ణులు ఈయుద్ధ పరిస్థితులయందు పాశ్చాత్యస్త్రీలనుండి ఎన్నియో విషయములు నేర్చుకోవలసి యున్నది. పురుషులతోబాటు వీరాంగనలుకొందఱు రణరంగములకరిగి ధైర్యోత్సాహములతో యుద్ధము చేయుచున్నారు. తమభర్తలను, పుత్రులను సంతోషముతో రణరంగములకంపి వారిదివరకు వహించియున్న బాధ్యతయంతయు తామే వహించుచున్నారు. రణరంగమునందు చీనా స్వాతంత్ర్యసాధనకై ఆదేశపు సోదరీమణులు జూపుచున్న ధైర్య సాహసములు, అత్యంతాశ్చర్యకరముగా నున్నవి.

స్త్రీల విద్యావిధానము పురుషులకంటె వేరుగా నుండవలయుననియు, పురుషులు అభ్యసించు విద్యకంటె స్త్రీ లభ్యసించువిద్య భేదముగా నుండవలయుననియు కొందరి అభిప్రాయమై యున్నది. ఆమె విద్యావిధానము ఆమెను గృహకృత్యములకును, స్త్రీలందరిచేతను ఆచరణయందుంచబడుచున్న "వివాహ"మను వృత్తికిని సిద్ధముజేయుటయే వీరి ఉద్దేశము. స్త్రీవిద్యయొక్క ఇట్టి సంకుచితమైనట్టియు, పక్షపాతమైనట్టియు దృక్పథముతో నేనేకీభవించజాలను. స్త్రీలకు సంఘమునందన్ని శాఖలయందును అత్యున్నతమైన విద్య నభ్యసింపజేయుటయేగాక సర్వవృత్తులయందును, సర్వావస్థలయందును తమ కర్తవ్యములను జయప్రదముగా నొనర్చునందులకు శిక్షణ మొసంగబడవలయును. స్వాతంత్ర్యము ఇతర పరిస్థితులన్నిటికంటెను అర్థికపరిస్థితుల మీదనే ఆధారపడియుండును. స్వాతంత్ర్యాజ్ఞలేక ఆర్థికముగా స్వతంత్రురాలుగాని స్త్రీ ఆమె భర్తపైననో, లేక మరొకరిపైననో ఆధారపడియుండవలసివచ్చును. ఆర్థికముగా నొకరిపై ఆధారపడువారు స్వతంత్రులుకాజాలరు. స్త్రీపురుషులకుండు సంబంధము ఒకరిపైనొకరు ఆధారపడని సంపూర్ణస్వాతంత్ర్య స్నేహములతోగూడుకొని యుండవలయును.

నిజాంరాష్ట్రాంధ్ర సోదరీమణులు స్త్రీ ఉద్యమముల యెడలను, ప్రజాఉద్యమముల పక్షమునను తమకర్తవ్యము నెరవేర్పవలయును. వారు అనారోగ్యకరములగు సంఘకనుమలలో నుండక, పర్వతారోహణ శక్తిని కలుగజేసికోవలయును. సంఘ దురాచారములతో పోరాడవలయును.

స్త్రీలఅభివృద్ధి నిరోధకమగు పర్దాను తుత్తునియలగావించి, ముక్కులను ధగ్గము చేసివేయవలయును. నేడు సంఘవిచ్ఛిన్నతకు కారణములగుచున్న మతపాక్షికములు, కులభేదములు, అస్పృశ్యత మొదలగువానిని ప్రతికూలించి అంతమొందింపవలయును. మంచివిద్య, వ్యాయామములను బడయవలయును.

కార్మికులు.

మన రాష్ట్రమునందలి కార్మికులు, అంతర్జాతీయ కార్మికసంఘము వారు కార్మికులకై ఒనరించిన అభివృద్ధికరమగు సిఫారసులన్నియును శాసనరీత్యా రాష్ట్రమున అమలుపరచుటకై ఔరంగాబాదుయందు జరిగిన ప్రథమ కార్మిక మహాసభయందు తీర్మానించినారు. అంతర్జాతీయ కార్మికసంఘమువారు జేసిన తీర్మానములు అన్ని దేశములవలనే భారత దేశమునందుగూడా అమలుయందు బెట్టబడుచున్నవి. ఇంకొక తీర్మానముద్వారా బ్రిటిషు భారతదేశమునం దెంతకాలమునుండియో అమలుయందున్న ట్రేడు యూనియను ఆక్టు (Trade union Act) కార్మికుల ప్రతిఫల శాసనము (Workmens Compensation Act) బాలెంతలకు లాభముచేకూరు శాసనము, (Maternity benefit Act) ప్రతిఫల నిర్ణయశాసనము (Payment of wages Act) శాసనరీత్యా అమలులో బెట్టుటకై కోరియున్నారు. వీరి ఈ న్యాయబద్ధమైన కోరికలు సత్వర ఆచరణీయములు. శాసనసభా సభ్యులగు శ్రీమందుముల నర్సింగరావుగారు ట్రేడు యూనియనుఆక్టు (Trade union Act)ను చిత్తుశాసనముగా ప్రవేశపెట్టిరి. కాని ప్రభుత్వమువారు సరియైన కారణములు జూపించకయే దానిని ప్రవేశపెట్టుటకుగూడా అనుజ్ఞనీయలేదు. జాగీర్దార్లకు, పెట్టుబడిదార్లకు సాహుకార్లకు వారివర్గమునకు జెందినట్టు హక్కులను కాపాడు ఉద్దేశములతో సంఘములను స్థాపించుకొనవకాశమున్నట్లు కార్మికుల కెందుకట్టి అవకాశములు కలుగింపబడుటలేదో నాకు దురూహ్యముగానున్నది. అనధికారరీత్యా స్థాపించుకొబడిన కార్మికసంఘములు అనుమానదృష్టితో జూడబడుచున్నవి. అట్టి సంఘములకై పనిజేయువారెందరో ఉద్యోగములనుండి తొలగింపబడుచున్నారు. కార్మికులలో విభేధ

ములబెంచి వారలనణచుటకై యజమానుల అధిపత్యముక్రింద వేరేసంఘ ములు స్థాపింపబడుచున్నవి. అన్నిటికంటే ముఖ్యమైనట్టి రైల్వే యూని యన్ సమస్య ఇంకా పరిష్కరింపబడలేదు. ప్రభుత్వమువారు ఈ విష యాల్లో జోక్యము కలుగజేసికొని తక్షణమే కార్మికులకు సహాయ మొనరింపవలయును.

హిందూ ముస్లిము సమస్య.

నేనిదివరకే మనవిజేసినటుల హిందూ జనసామాన్యము యొక్క యు, ముస్లిం జనసామాన్యముయొక్కయు ముఖ్యాతిముఖ్యమగు సమస్య వారి దారిద్రిసమస్య. కాని కొందరు స్వార్థపరులగు నాయకులు సామా న్యప్రజలు తమనిజమైన సమస్యలను తెలిసికొనినచో తమకుగల వ్యక్తి గత లాభములు (Vested interests) కు భంగమువాటిల్లునను భయ ముచే, జనసామాన్యముయొక్క దృష్టిని మతపాక్షిక తత్వములవైపు త్రిప్పి, హిందూ ముస్లిం జనసామాన్యములో కలహాములు కల్పించుచు న్నారు. ఈరహస్యమును అజ్ఞానులైన జనసామాన్యులు తెలుసుకోలేక స్వార్థపరులగు నాయకులమాటలే దైవవాక్కులుగానమ్మి ఒకరినొకరు హింసించుకొనుచున్నారు. హిందూ ముస్లిం ఐక్యత ధనికవర్గముకంటె నెక్కువ వారిసమస్య లోకటేయైనందున జనసామాన్యమునందే కలుగు అవకాశములున్నవి. గావున వారుతమ నిజమైనసమస్యలను గ్రహించి, స్వార్థపరులగు ఈ మతపాక్షిక నాయకుల హితోపదేశములను పాటించక నిజమైన హిందుముస్లిం ఐక్యతను కలుగజేసి, తమహక్కులకై సమిష్ఠి ప్రయత్నము సలుపవలెనని నేను ప్రార్థిస్తున్నాను.

ఈ సందర్భమున నేనొకవిషయము తమదృష్టికి దెచ్చుట అవసర మని తలచుచున్నాను. ప్రపంచమందంతటను, ఆధునిక రాజ్యాంగ సిద్ధాంతములయందును, ఆచరణవిధానమునందును మతమునకును, రాజ కీయములకును ఎంతోఎడము ఏర్పడినది. నేడు రాజ్యాంగములను మత గ్రంథములను ఆధారముగా జేసికొని మతోన్మాదుల మాటలపై జరుప తలచుట అపహాస్యమునకు కారణమేగాక ఎంతో అవివేకవిధానముగా పరిగణింపబడుచున్నది. ముఖ్యముగా మన భారతదేశములో మతవిష

వాయువు రాజకీయములలో క్రమేణా తగ్గుచున్నప్పటికి అప్పుడప్పుడు తుఫానువలె చెలరేగి దేశమునకెంతో అపకారము చేయుచున్నది. యుద్ధరంగమున వీరతాండవమాడుచు ముందుకుచొచ్చుకొని పోవుచున్న గుర్రమువలె మనము పొందుచున్న రాజకీయచైతన్యమును మతవిష వాయువగు కళ్లెముచే వెనుకకే లాగబడుచున్నాము. తినుటకన్నము, ఉండుటకు వలయుగృహము, సభ్యప్రపంచమున సోదరమానవులతో తల యెత్తి తిరుగుటకు అర్హతబొందవలసిన ఈరోజుల్లో, ఇంకను మనము బూజుబట్టిన జమీందారీతత్త్వమును ఆధారముచేసికొని మతములో మునిగి పోవుచున్నాము. ప్రజలమతము, ప్రభువుమతము ఏకమైనంతమాత్రమున ప్రజలకైనందిన సమస్యలు పరిష్కరింపబడునని తలంచుట భ్రమయని మనకు అనుభవమువలన తేలినది, చరిత్రచాటుచున్నది. మైసూరు, తిరువాన్కూరు, భూపాల్ సంస్థానములకుజెందిన ప్రజలు రాజుమతమునకు చెందినవారైనను వారు తమ స్వత్వములను సాధించుటకై పోరాటముల జరుపుచునేయున్నారు. ఇట్లెన్నియో ఆధారములుగలవు. కాని దురదృష్టవశమున హైదరాబాదు నందలి కొందరు ముస్లిముసోదరులు వ్యవస్థాపూర్వకముగా వింతవింత స్వప్నములుగని హైదరాబాదు మహమ్మదీయులెల్లరును రాజులనియు, మహమ్మదీయులులేకున్న రాజు లేడనియు హద్దుపద్దులేని ఆడంబరముల ప్రదర్శించి ఆందోళన కారకులైరి. రాజకీయాభివృద్ధికోరు ఇతరులను అనుమానదృష్టితో చూచి తాము కేవలము తమకై హక్కులుసాధించి స్వస్థనొందతలచి యుండిరి. కాని ప్రభుత్వమువారు హైదరాబాదు నేషనల్ కాన్ఫరెన్సును నిషేధించుచు అవలంభించిన విధానమునే పై మహమ్మదీయుల సంస్థకుగూడా అన్వయింపచేసిరి. "శాసనసభయందలి అధికసంఖ్యాకుల అధికారముతో ఉత్పత్తియగు స్వరూపముగల ప్రభుత్వనిర్మాణము ఈసంస్థ ఆశయమై యున్నది. ప్రజావశ్యకతలు పరిపాలకుని అవి భాజ్య బాధ్యతలకు—ప్రజా శ్రేయము కొరకుగాను—లోనై యుండునట్టిపద్ధతి సాగుచునే యుండవలయునని గావింపబడిన ప్రభుత్వప్రకటన సూత్రమునకిది వ్యతిరేకముగా నున్నది." అని ప్రభుత్వమువారు ప్రకటించియుండిరి. దీనిచే

నేటికైనను మహమ్మదీయ సోదరులు తమస్థితిని తెలిసికొని, తాము గూడా నిజాంరాష్ట్రపు మిగత దేశీయులవంటి పాలితుల మేయను సంగతి మరవక, సోదరభావముతో మెలగి, పాలకవర్గమను శుష్కపదాలను పరిత్యజించవలయును. సోదర దేశీయులతో సహకారమొనర్చి, సంస్థానప్రజల రాజకీయ, ఆర్థిక జీవనాభివృద్ధికై చేయూతనొసగుటకు ఇది మిక్కిలి అమూల్యావకాశమని తెలుపుచు, "ఆసఫ్‌జాహివంశ ఛత్రచ్ఛాయయందు నిర్మింపబడు జిమ్మెదారి ప్రభుత్వమును మీరాక్షేపించుచున్నారని దీనిభావముగా తలచుచు, ఒకవేళ ఇటులేయైన ఈ ఆక్షేపణ పౌరస్వాతంత్ర్యమును, భావప్రకటణాస్వాతంత్ర్యమును మూలచ్ఛేద మొనర్చునసియు, సంస్థానప్రజల స్వతంత్రసహకారమే రాజవంశస్థిరపరిరక్షణకు ఉత్తమ మార్గమనియు మేము వాదించెదము." అను నినాదమును నిజాంరాష్ట్రపు ప్రజలు ముక్తకంఠముతో ప్రభుత్వమునకు తెలుపవలెనని హెచ్చరించుచున్నాను.

ముగింపు.

నేను మీతో మనవిజేసినవియేగాక ఇంకను ఎన్నియో సమస్యలున్నవని నేనెరుగుదును. నాదృక్పథముతో ముఖ్యమని భావించిన వాటినే మనవిజేసినందులకు క్షమింతురుగాక. ఇంతకాలమువరకు శ్రమయనక నాఉపన్యాసము వినినందులకు మీకందరికీ నా హృదయపూర్వకమైన కృతజ్ఞతలు.

ఇదే సందర్భమున ఆంధ్రయువకులతో కొన్ని విషయములు మనవిజేసికోవలసి యున్నది. నేడు దేశాభ్యుదయ ప్రయత్నములయందు ఉత్సాహముమాత్రమే పనికిరాదు. ఉత్సాహముతోబాటు నైపుణ్యత, శిక్షణ (Discipline) విషయ పరిజ్ఞానము, ఓర్పు, శాంతత, స్వ విమర్శ (Self criticism) స్వ పరీక్ష (Self examination) స్వ శిక్షణ (Self education) మొదలగు గుణములు దేశసేవకునికి అత్యంతావశ్యకములు. నిజముగా దేశాభ్యుదయము యువకులపైననే ఆధారపడి

యున్నది గావున, ఇట్టి గుణములన్నియును సాధించి, దేశాభ్యుదయము నకై నడుముగట్టుటకు నేను ఆంధ్రయువకులను ఆహ్వానించుచున్నాను.

రాబోవు సంవత్సరమునందు కార్యనిర్వాహణము అన్ని పక్షముల వారి సహకారముతోనే నే జరుపదలచినానని ప్రకటించుట నా విధియ నియే తలంచుతాను. మన మభివృద్ధిజెందుచున్న ఈ సమయమున మన సమిష్టి ప్రయత్నమునకు భేదము వాటిల్లుట మన సంస్థకు నష్టదా యకమని నేను భావించుచున్నాను. కావున అన్ని పక్షములవారును రాబోవు సంవత్సరమునందు నాతో సహకారమొనర్చెదరని ఆశించు చున్నాను.

దేశీయులందరును మ. ఘ. వ. నిజాం ప్రభువుగారి చల్లని ఛత్ర ఛాయన అన్నివిధముల అభివృద్ధికరములగు అభీష్టములు నెరవేరి, ఆనంద ముతో జీవితము గడుపుదుముగాక.

ముగిసినది.

౩౬౩

